# మే ఘ స ం దే శ ము

## తెనుగు పద్యకావ్యము

కృతికర్తలు

మొదటి సర్గము : తాడూరి లక్ష్మీనరసింహా రావు

రెండవ సర్గము : తాడూరి రామచంద్రరావు, బి. ఎ.,

న్యాయవాది, రాజమహేంద్రవరము

1951

# మున్నుడి

జీవితము కేవలము వ్యవహార తన్మయంబుగ నెంచువారి కెట్లుండునో గాని, భావనాస్వభావముగల మనస్సుగలవారికిఁ జిఱుతప్రాయమునాటి యనుభవముల తలంపులు ముదిమినేనియు మదిని ముదమొదవింపక మానవు. నేను పంచషవర్షప్రాయుండ నైనతఱి మజ్జనకుఁడు మేఘసందేశపూర్వసర్గము నాంధ్రీకరించుచో మూలములోని శ్లోకములు జదువుచుండినప్పు డేనవి వినుచు, నాకప్పటి కర్థజ్ఞాన మించుకయు లేనిదయ్యును వాని లలితపద గుంభనంబుననో, గమనసారళ్యవిశేషంబుననో, గీతికామాధుర్యంబుననో వీనులకు విందుగలిగి డెందమానందంబునఁ గందళింపఁ దద్గ్రంథంబుపై ననిర్వచనీయంబగు ప్రేమాతిశయంబును తత్కర్తయైన కాళిదాసునియెడ నిరంతర గౌరవభావంబును దోడన జన్మించె. తరువాత నప్పటికముద్రితమైన మజ్జనకు నాంధ్రీకరణములోని సులభపద్యములఁ గొన్నింటిని జదివి యానందించుచుంటిని. పదపడి సంస్కృతభాషాప్రవేశము గలిగిన వెనుక నేను మూలమును జదువగా దానియెడలను దత్కర్తయెడలను దొలుతగలిగిన గౌరవ భావమినుమడించె. నాజనకుని కృతి చిరకాల మముద్రితముగనుండి యాతని మరణమున కొక సంవత్సరము పూర్వము క్రీ॥ శ॥ 1935లో

ముద్రింపఁబడుచుండు తఱి నాతఁడు రెండవసర్గము నాంధ్రీకరింపుమని నాతో విలాసముగఁ బలికెను. వెంటనే రెండుశ్లోకములు మాత్రము దెనిఁగించి యుపేక్షించితిని. ఆతని మరణానంతరము నాప్రమత్తతకుఁ బశ్చాత్తప్తుఁడనై రెండవసర్గము తోడన నాంధ్రీకరించి కాళిదాసునియెడ నాకుగల గౌరవమును వ్యక్తీకరించినవాఁడనేగాక నాతండ్రి కోరికను నెఱపి పితౄణము గొంతవట్టు దీర్చినవాఁడనైతినని సంతసిల్లుచున్నాఁడను. నేఁడది మజ్జనకుని పూర్వసర్గముతోఁ ముద్రింపించి ప్రచురించుచున్నాఁడను.

తాడూరి రామచంద్రరావు,
కృతికర్త

రాజమండ్రి,
1951

# సంస్కారపత్రము

| పుట | పద్య: | పాద | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|
| iv | | | 4 | తప్పుఁడ | త్రప్పుఁడ |
| 10 | | | 9 | తారత్వ | తారత్వము |
| 12 | 2 : | 4 | | శాంతంబందు | శాంతింబొందు |
| 23 | 38 : | 1 | | యొకడొక | యొండొక |
| ,, | ,, : | 2 | | గలటి | గంటి |
| 24 | 39 : | 3 | | తొల్చిలన్కన్ | తొల్చిన్కలన్ |
| 32 | 7 : | 4 | | గుంకమున్ | గుంకుమున్ |
| 33 | 10 : | 1 | | కిన్నరలు | కిన్నరులు |
| 43 | 51 : | 3 | | యన్నట్టు | యున్నట్టు |

మూలకృతికర్త యెడల మహాపరాధము సేయుటయే. మఱియు
నది చోరుఁడు తన చౌర్యమును డాగురించుటకై చోరితవస్తువులపైఁ

ముద్రింపఁబడుచుండుతఱి నాతడు రెండవసర్గము నాంధ్రీకరింపుమని నాతో విలాసముగఁ బలికెను. వెంటనే రెండుశ్లోకములు మాత్రము దెనిఁగించి యుపేక్షించితిని. ఆతని మరణానంతరము

# భాషాంతరీకరణ పద్ధతి

కావ్యరచన కియ్యది నా ప్రథమవ్యవసాయంబయ్యును నాంధ్రీకరణక్రమంబున నాకుఁ గలిగిన యనుభవముల ననుసరించి నాకుఁ దోఁచిన భాషాంతరీకరణ పద్ధతులను విద్వల్లోకంబునకు వెల్లడిసేయుట యుచితమని యెంచి యవి యిందుఁ బొందుపఱచుచున్నాఁడను.

మూలమువలన నపక్రమించి యందలి విషయములను సందర్భానుసారముగ మార్పుఁజెందించి, కొన్నింటిని విడనాడి, కొన్ని క్రొత్తవిషయములను గూర్చి రచించినచో మూలమునకు వన్నెవెట్టినట్లుండుననియు గ్రంథము భాషాంతరముజెందినట్లుండక, స్వభావసిద్ధముగనుండుననియు విమర్శకులు సామాన్యముగ నుద్ఘాటింతురు. కొండొక సందర్భమునఁ బుట్టిన యీవిమర్శనాసూత్రమును సందర్భశూన్యముగ ననువదించి సామాన్యసూత్రముగ గ్రహింపఁజనదు. ఇది కథాప్రధానమగు నాటకేతిహాసాది గ్రంథములయెడల వర్తించునుగాని యీ మేఘసందేశమునుబోలు ప్రకృతి సౌందర్యవర్ణనాభూయిష్టమైనట్టియు భావప్రధానమైనట్టియు గ్రంథములయెడలఁ బ్రవర్తింపఁజేయఁగాదు. అట్లు ప్రవర్తింపఁజేయుట మూలకృతికర్తయెడల మహాపరాధము సేయుటయే. మఱియు నది చోరుఁడు తన చౌర్యమును డాగురించుటకై చోరితవస్తువులపైఁ

గావించెడి మార్పులచందమును స్ఫురణకుఁదెచ్చెడిని. యాథాతథ్యముగఁ బరివర్తనము సేయఁజాలని కవులకాపై యాపై సూత్రము సమాధానవాక్యముగ నుపకరించును. కాని యట్టిసమాధానము వారికి సదాధారముగాదు. పరివర్తనముపేరిటఁ బెఱకవుల భావములను జించిచెండాడి వికృతినందింపఁబాడిగాదు.

కొందఱు కవులీ మేఘసందేశమును దెనిఁగించుటలో మూలమునకు వన్నె వెట్టు మిషతో కృత్రిమకథాప్రధానమగు గ్రంథములందుఁబోలెఁ దమగ్రంథమున కవతారికగా యక్షునియందు, మూలములోలేని వర్ణనములనేకము లారోపించియు, కొందఱు నాటకరంగ మొకదానిని గల్పించి యక్షముఖమునఁ గొంత యేకాంతభాషణము సేయించియుఁ గొన్నిమార్పులు జేసిరి. తుదకు రామగిరిసానువునుండి మేఘ మెగసిపోవుచుండగా యక్షుఁడది తన సందేశమును గొని పోవుచున్నదనియే తలంచెనను వింతభావమును కొండొక కవి కల్పించె. ఇట్టి కల్పనలచే నీగ్రంథమునందలి కథ నిశ్చయముగా జరిగెననియో జరుగుచున్నదనియో పాఠకులకుఁ దోపింపనెంచిరి గాఁబోలు. ఇది మిక్కిలి హాస్యాస్పదమైన కల్పన. నాటకప్రదర్శనమందైనను ప్రేక్షకులు దాము గాంచునది నిశ్చయమని యెన్నడును దలంపరు. అట్టితఱిఁ జూఁపఁబడు వేషములు రంగస్థలములు, సంభాషణములు రసోద్దీపకములై ప్రేక్షకుల భావములను స్ఫుటీకరించుట కుపకరణములగునుగాని, వారు చూచునది కృత్రిమసంఘటనముగాదను నాశయమును జనింపఁజాలవు. అది గాన మేఘసందేశమునుబోలు భావప్రధానమగు శ్రవ్యగ్రంథములయందు నాటకానురూపములగు కల్పనములను జేర్చుట కడునసంగతము. కాళిదాసు "ధూమజ్యోతి స్సలిలమరుతాం" అను

పద్యమును దాను యక్షునిచే జడపదార్థమగు మేఘముతో భాషింపఁజేయుతటి కేవలము కవిసమయమగు సమాధానవాక్యముగా రచించెనుగాని యక్షుఁడు నిశ్చయముగాఁ జేతనాచేతనజ్ఞానశూన్యుఁడై భాషించెనన్న యలీకభావము పాఠకుల మనస్సున జనింపఁజేయుటకుఁ గాదు. చాతుర్యహీనుఁడగు కొండొక కవి యట్టి యలీకభావమును జనింపఁజేయ సమకట్టినను బాఠకులు మాత్రము మోసపోరు. సమర్థుఁడగు కవి శ్రవ్యగ్రంథమందైనను దనభాషాకౌశలముచేతను, రచనాపాటవముచేతను బాఠకులకు లెస్సగ భావోద్దీపనము గలుగఁజేయఁజాలకపోఁడు. భాషాభావముల కవినాసంబంధము గలుగుటచే సుప్రయుక్తమగు భాషతోఁడి రచన చదివినతోడనే యుత్కృష్టమగు భావముగా వ్యక్తపడి విషయము దృగ్గోచరంబగును. భోజనసామర్థ్యములేని శిశువత్యాశచే నమితముగ మధురరసపూరితమగు పాయసమును బోయించికొని యది భుజింపఁజాలక కటురసపూరితమగు చిత్రాన్నము నాసించి యదియు భుజింపఁజాలక రెంటిని మేళవించి మిటకరించుచుండఁగాఁ దజ్జనని దానింగాకు లేనిందిని హర్షించుఁగాకని బయటకు విసరి యావిలువగల పదార్థమట్లు బీఱువాఱుట కెంతయువగచునట్లే పైవిరుద్ధకల్పనముల మేళవంబునకు భాషామతల్లి యెంత దుఱపిల్లునోగదా. భాషాకౌశలములేని కవి మూలములోని భావములను, శ్రుతిమధురములై సూక్ష్మములగు పదములతో సద్యఃస్ఫుటనము జేయఁజాలక వృత్తములలో నిమిడింపఁజాలక యెఱుకసాని జెప్పెడు గద్దెవోలె సపార్థక నిరర్థకపదములతో విరివిగా రచించియు లోపములను గప్పి పుచ్చుటకు భావద్యోతకములై యసభ్యములై వికృతములగు పటములను గ్రంథమధ్యమున నక్కడక్కడఁ జొనుపుటయు

వికటంబగు మకుటంబులు గూర్చుటయుఁ గలదు. అంతమాత్ర మున రచన వన్నె కెక్కనేరదు.

సంస్కృతాంధ్ర భాషలకు నన్వయక్రమమందును, వాక్య ముల కూర్పునందును, జాతీయములందును విశేష భేదములు గలవు. కవి యాభేదములను జక్కఁగఁ బాటించి మూలములోని భావములు మాత్రము మార్పు సేయక మూలములోని వాక్యరచనాక్రమమును దన భాష కుచితమగురీతిని మార్చి మూలపదంబుల కనురూపము లైన తన భాషలోని జాతీయములనే ప్రయోగించుచుఁ బ్రవర్తింపఁ గలిగెనేని నా రచన స్వభావసిద్ధమగు స్వోక్తిరీతి నలరారక పోదు. మఱియు మూలములోని వ్యంగ్యోక్తులును వాచ్యార్థములును బరి వర్తనమున వ్యత్యస్తములు జేయఁబడునేని గ్రంథము వికారరూప మును జెంది గుణగ్రహణపారీణమగు పాఠకలోకమున కేవ జనింపఁ జేయును. మూలపదంబులకంటె క్లిష్టతరములై, గూఢములైన పదములతోడి పరివర్తనము ప్రసాదరహితమై నిరర్థకమగును. పద్యమును చదువుచో నందలి పదములొండొంటిని సహజముగా జొచ్చుకొనిపోయి లలితోచ్చారణముగలవై జలప్రవాహమువలె నలరారవలయును గాని మోకాళ్లపర్వతమెక్కినట్లుండరాదు. సమానాశ్రయంబులైన విశేషణవాక్యములకు నడుమను సంబంధ పదములు ప్రయోగింపక సంస్కృతంబునంబలె సమాన విభక్త్యం తములు సేయుట తెనుఁగుభాషకొక్కొక్కచో వికారరూపమును దెచ్చిపెట్టును. అట్టి ప్రయోగము భక్తి, రౌద్రము మొదలగు నుద్రేకభావములను దెల్పుట కుపకరించునుగాని సర్వసాధారణ ముగా ప్రయోగింపఁజనదు. పోతనామాత్యుండది మిక్కిలి సహ జముగాఁ బ్రయోగించెను. కాని కొందఱు పరివర్తకులు భాషా

కౌశలము లేమిచే వాక్యానుక్రమణికగా భాషాంతరీకరణము చేయుచు నిట్టి వికార ప్రయోగమును జేయుదురు. స్థాలీపులాక న్యాయమునఁ గొన్ని యుదాహరణములు జూపెదను.

"ఆధిక్షామాం విరహశయనే" అను 28 వ శ్లోకమును తెనిఁగించుటలో పెక్కురు కవులు మూలమును పాదానుక్రమణికగాఁ దెనిగించి విరుద్ధార్థమును గల్పించిరి. మఱియు "సంభోగాన్తే మను సముచితో హస్తసంవాహనానాం" అను దానిని తెనిగించుచో నొక కవి "మామక హస్తమర్దనల మన్మథకేళిసమాప్తి నంద" అని రచించి యసభ్యార్థము గల్పించె. "శుద్ధస్నానాత్ పరుషమలకం" అను శ్లోకమును దెనిఁగించుటలో సరియైన తెనుఁగు జాతీయమును బ్రయోగింపఁజాలక "ఉత్తతానము" అని "అచ్ఛవుఁదానము" అనియు, "తలయంటు లేని గ్రుంకుట" అనియు పెక్కురు పెక్కురీతుల వికార ప్రయోగములు జేసిరి. "త్వద్గంభీర ధ్వనిషు శనకైః" అనునది తెనిగించుటలో నర్థద్యోతకమగు శబ్దముగల పదగుంభనము నొనర్పరైరి—ఉదాహరణము లింకను పెక్కులు పాఠకులు గ్రహింతురుగాక.

కాళిదాసు తన మేఘసందేశములో నొక్కొక్క శ్లోకమున నొక్కొక్క భావమును, లేదేని తదనురూపములైన భావములనే మఱి కొన్నింటిని విశదీకరించి సంపూర్తి చేసినాఁడు. అది యా గ్రంథములోని విషయముల కెంతయుఁ దగిన విధానము. సుబోధములై సుసూక్ష్మములగు పదములతో జటిలసంయోగంబు నేయం గల రచనాకౌశలంబు నేరమిఁ బరివర్తకు లా భావమునొక్క వృత్తములోనమర్పఁజాలక దానిని భంగపఱచి రెండుమూడు పద్యముల లోనికి సారించుట యుక్తముగాదు. అట్లొనర్చిన పరివర్తనము,

వేణిందాల్చిన సంకుచిత నూతనపుష్పదామము ధూర్తుని బలవద్ర తంబున విడివడ సంఛిన్నములైన యందలి పూలందందు చిందర వందరలై రాల రతాంతమున డిల్లపడి దిగజారిన యంగకములతోఁ జెన్నుదఱిగి విన్ననై నిశ్చేష్టతనున్నయన్నుగతిం గాన్పించును.

మఱియు మూలములోని శ్లోకములెల్ల మందాక్రాంతా వృత్తమున రచింపఁబడినవి. ఈవృత్తములోని పాదమున నాద్యంత భాగములందు గుర్వక్షరములును మధ్యభాగమున లఘువులును గుమిగూడియుండుటచే నాగుర్వక్షరముల యుచ్చారణము సంగీతముగాఁ బరిణమింప మధ్యమునందుగల లఘువు లాసంగీతకాలమునఁ గావింపఁబడు మృదంగధ్వనిభ్రాంతినొసంగును. మనస్సున జనించిన మృదుమధురభావమే సంగీతరూపమున వ్యక్తమగును. ఛందోబద్ధమైన సంగీతమే పద్యము. అది గాన మృదుమధురభావ ప్రధానమగు నీ కావ్యమున కా వృత్తమే యెంతయుఁ దగినదై యున్నది. దాని కించుమించుగ ననురూపములై తెనుఁగన సామాన్యముగ రిచింపఁబడునవి శార్దూల మత్తేభవిక్రీడితములే. తదితరములీకావ్యమున కెంతయు ననుచితములు. అట్లయ్యును నేను దెనిఁగించిన ద్వితీయ సర్గమున 10 యు 17 నగు పద్యములు చంపకమాలలే రచించితిని. అందలి భావములు తక్కుంగల పద్యములలోని వానియంత విశిష్టములుగావని తోఁచియో మఱి యేకారణముననో యిట్లు రచించితిని. మఱియు 1, 21, 43 అగు పద్యములు దొలుత మత్తేభములుగ రచించియు నందలి వర్ణనావిశేషముల కా జటిల సంక్షిప్తరచనగల వృత్తము లనుచితములుగఁ దోప వానిని సీసములుగ మార్చినాఁడను. అయినను మూలము నందలి భావములను విశదీకరించితినేగాని యించుకయు మార్ప

నందించ లేదు. 42 అగు శ్లోకములోని రహస్యానంద భావ వ్యక్తీకరణమునకుఁ దగిన వృత్తమనియు, రాగభేదముచే శ్రుతికించుక విశ్రాంతి గలుగుననియు నెంచి యది బంధరవృత్తముగా రచించి నాఁడను.

నాకుఁదోఁచిన పై విమర్శనాభిప్రాయముల ననుసరించియే నే నీ గ్రంథమునందలి ద్వితీయసర్గము నాంధ్రీకరించితిని. క్వాచిత్కముగ దీర్ఘ సమాసములను దప్పించుకొనలేక పోయితిని. కావ్యరచన కియ్యది నా ప్రథమప్రయత్నమగుటచే లోపములేవేని గలుగవచ్చు నయ్యవి విద్వాంసులు నిర్దేశించిరేని వందనములతో సంస్కరించికొందును.

## ప్రక్షేప పాఠప్రశంస

ఈ గ్రంథమునఁ బ్రక్షిప్తముగాఁ బరిగణింపఁబడు శ్లోకములను గూర్చి ప్రశంసించుటకు ముందుగా 2 వ సర్గములోని 40 అగు శ్లోకమునుగూర్చి యించుక జెప్పవలసి యున్నది. అది "తామాయుష్మన్ మమచ వచనా దాత్మనశ్చోపకర్తుం" అను శ్లోకము. దీనిని తెనిఁగించుటలో కవులందఱును మల్లినాథుని వ్యాఖ్యానమునే యనుసరించిరి. 'మమవచనాత్'=నా ప్రార్థనావచనము నిమిత్తముగాను, 'ఆత్మనశ్చోపకర్తుం'=నీవు అనగా మేఘము ఇతరులకు అనగా యక్షునికి ఉపకారముచేయుట మూలముగా కృతార్థత్వము బొందుటకును, అని మల్లినాథుని వ్యాఖ్యానము. ఇది నాకేమియు సమంజసముగఁ గనుపించలేదు. పూర్ణసరస్వతి రచించిన 'విద్యుల్లతా' నామక వ్యాఖ్యానములో "ఆత్మనశ్చోపకర్తుః" అని షష్ఠీవిభక్త్యంతముగాఁ బాఠాంతరము ఆమోదింపఁబడినది. 40 మొదలు 42 వ శ్లోకము నంతమువఱకు నుపకర్తయయిన మేఘుని యొక్క వచనముగాను తరువాతి శ్లోకములు యక్షునివచనముగాను నుడువునది యని యక్షుఁడు మేఘునితో నన్నట్లుగా నీ వ్యాఖ్యలో నున్నది. ఇది సంగతముగాఁ దోచుడు నేను దీనినే యనుసరించితిని.

ప్రథమసర్గములో "ధూమజ్యోతిస్సలిలమరుతాం" అను 5 వ శ్లోకముతోఁ జరమసర్గాంతశ్లోకద్వయము పొసఁగదనియు మొదట మేఘ మచేతన మని నుడివిన కవి తుదినా మేఘముచేతనే వార్తను బలికించుట యసంభవమనియు 55 వ శ్లోకమున యక్షుఁడు మేఘున

కాశీర్వాదమిడుటచే నదియే మంగళాన్వితమైన గ్రంథాతమనియు గొందఱు నుడివెదరు. "వయం తత్త్వాన్వేషాన్ మధుకర! హతాస్త్వం ఖలుకృతీ" అను శాకుంతలాంతర్గత శ్లోకములోని యభిప్రాయము రీతిని బ్రాయికంబుగ నిట్టి వాదములు తత్త్వాన్వేషణార్థమయిన శుష్క హేతువాదముల కాధారమగును గాని గ్రంథములోని భావముల చింతనచే జనించెడి రసానుభవమున కుపకరించునవిగావు. వీని నైష్ఫల్యంబును నానంత్యంబును దెల్పుటకై యించుక ముచ్చటించి విడుతును.

రఘువంశమున 13 వ సర్గములో "ప్రవృత్తమాత్రేణ పయాంసిపాతుం" అను 14 వ శ్లోకమున మేఘము నీరుగ్రోలుటకు సముద్రమును బ్రవేశింపఁగా నక్కడ నావర్తవేగమున మంథరగిరి వలె భ్రమించెనని చెప్పి మేఘమును నీరుగ్రోలెడి చేతనముగా వర్ణించిన కాళిదాసునకు మేఘసందేశము రచించునాటికి మేఘ మచేతనమని యెట్లు స్ఫురించెను? కావున "ధూమజ్యోతిః" అను శ్లోకమే ప్రక్షిప్తమనుట కవకాశము గలదు. కాని నిశ్చయముగ మేఘ మచేతనమని తెలియని కవి యుండునా? రఘువంశములోని శ్లోకములో కాళిదాసు, ఆంగ్లమున "వాటర్ స్పౌట్" అనబడు ప్రకృతి దృశ్యమును నాలంకారికముగా వర్ణించెనని నాయభిప్రాయము. ఇఁకను "ధూమజ్యోతిః" అనునది ప్రక్షిప్తముకానిచో దాని తరువాతి శ్లోకము ప్రక్షిప్తము కావలయును. దాని 4 వ పాదము "యాచ్ఞా మోఘావరమధిగుణే నాధమే లబ్ధకామా" అని యున్నది. ఇది యక్ష వాక్యమా కవి వాక్యమా? అది యక్ష వాక్యమని సిద్ధాంతము చేయుదము. ఇందు యక్షుఁడు తన యాచన మోఘమగునని తొలుతనే నిశ్చయించుకొనుచున్నాఁడు.

అది మేఘ మచేతనమని తా నెఱిఁగియుండుటచేత నేగదా. పూర్వ శ్లోకమునఁ జేతనాచేతనజ్ఞానము లేమిచే మేఘమును యాచింపఁ బోవునట్లుగా వర్ణింపఁబడిన యక్షునియం దాజ్ఞానమును 6 వ శ్లోకములో నారోపించుట విరుద్ధముగాదా. అట్లుగాక 4 వ పాదము కవివాక్యమేయైనచో 5 వ శ్లోకమును రచించినప్పుడు చేతనాచేతన జ్ఞానము గలిగిన కాళిదాసున కా జ్ఞానము 6 వ శ్లోకము రచించునప్పుడు నశించెనని చెప్పవలయును. ఇందు 4 వ పాదమున రెండు విషయములు పరస్పరము పోల్పఁబడి యందొక్కదాని తారతమ్య స్థిరీకరింపఁబడినది. మొదటిది యచేతనమై ప్రకృతిచేత నే తన యాచనను సఫలీకరింప నశక్తమైన మేఘము నుద్దేశించుచున్నది. రెండవది చేతనము. ఏలనగా దానిని యాచించిన యాచన లబ్ధకామగాగల యవకాశమున్నదని కవి సూచితమే. ఇట్లు విజాతీయములును విరుద్ధస్వభావములునగు చేతనాచేతనములను పోల్చి తారతమ్యము చెప్పుట కేవలమసంగతమే కాక యిందనవసరంబును నప్రకృతమునై యున్నది. ఇట ప్రకృత విషయము మేఘమే కాని యధముఁడు కాఁడు. చేతనుఁడైన యధముడు ప్రకృతవిషయమగునేని వాని న్యూనతను నిర్దేశించుటకై వానిని వేడుకొలుకంటె నచేతనమగు నొక మొద్దును వేడికొంట మేలని నుడువుట ప్రకృతము. అట్లుగాక ప్రకృతవిషయమైన మేఘమును ప్రశంసించుటకై వాని వేడుకోలొక యధముని వేడుకోలుకంటె మంచిదనుచెప్పుటయందేమి యౌచిత్యము గలదు? మఱియు కాళిదాసు, ఈ రెండువిషయముల చేతనాచేతన భేదము స్పృశింపక వాని గుణాగుణభేదమే నుడివి తారతమ్యము నుడివెను. కావున కాళిదాసు 6 వ శ్లోకమును రచించుచో మేఘ మచేతన మన్న

మాట మఱచి యందలి మొదటి రెండుపాదములలోఁ దాను యక్షు నిచేఁ బలికించిన మేఘుని యాభిజాత్యాది గుణములు నిక్కమని మెంచి మేఘము చేతనమని భ్రమించి 4 వ పాదము నట్లు రచించెనని చెప్పవలసి యుండదా ? మఱియు నక్కడక్కడ యక్షుఁడు మేఘు నితోఁ బలికిన శ్లోకములలో మేఘ మచేతనమని యక్షుఁడెఱిఁగి యున్నట్లే ద్యోతమగుచున్నది. 2 వ సర్గ॥ 20 వ శ్లోకమున మేఘుఁడు తన విద్యుదున్మేషదృష్టిని భవనాంతర్భాగమునకుఁ బ్రసరింపవలసినదిగా యక్షుఁడు చెప్పెను. 37 వ శ్లోకమున యక్షుఁడు తన స్తనితవచనములలో యక్షాంగనకుఁ బలుకవలసిన దిగా యక్షుఁడు చెప్పెను. చేతనాచేతన జ్ఞానశూన్యుఁడైన యక్షుఁడు నిశ్చయముగా మేఘునకు వాక్చక్షురింద్రియములు లేవని యెఱిఁగి యున్నట్లు రూపకాలంకారముతోఁ బలుకుట యెట్లు సంభవించును ? ఇట్టి శ్లోకములను బ్రక్షిప్తములన వలదా ! "ధూమజ్యోతిః" అను శ్లోకమునఁ గామార్తుఁడైన యక్షుఁడు చేతనాచేతనజ్ఞానశూన్యుఁడని స్పష్టముగాఁ జెప్పక "కృపణుఁ డని" మాత్రము చెప్పెను. అయినను కృపణుఁడను పదమునకు సందర్భమును బట్టి చేతనాచేతనజ్ఞానశూన్యుఁడనియే యర్థము గాని మల్లినాథుఁడు చెప్పినట్లు కేవలము దీనుఁడని కాదు. తుది శ్లోక ద్వయము ప్రక్షిప్తమను విమర్శకులు పై సిద్ధాంతమున కేమి సమా ధానమిత్తురో. నా యభిప్రాయము మాత్రమిది. ఉత్కృష్టకవుల రచనలను శుష్కవాదములకు విషయములుగాఁ జేయక యందలి రసమును మాత్రముగొని యానందించుటయే యుచితము.

తాడూరి రామచంద్రరావు,
కృతికర్త

## అంకిత పద్యములు

మ॥ కలకాలం బట పుణ్యలోకవసతిన్ గల్పింపఁగా నీకు నీ
విల వీడ్కొన్నదియొ కేట మత్సుతను దండ్రీ! కూర్చి స్వ్రసేయుతో
నల నీపుత్రికయింటఁ జేర్చినటు నాగావెన్క-సర్గంబు నీ
తొలిసర్గంబును జేర్చి పూర్ణమొనరింతున్ మేఘసందేశమున్.

మ॥ తనువున్నప్పుడు తీరనట్టివగు తత్తద్వాంఛలామీఁద నా
త్మను వెన్నంటు సుతుండు దీర్పఁదగుఁగాదా వాని నంద్రార్యులీ
వసఘూ! యుత్తరమేఘమున్ దెనుఁగుజేయన్ నన్నుఁగోరంగ నేఁ
దెనిఁగింపన్ మును నేఁడొనర్తు నదిశాంతంబందు తండ్రీ దివిన్.

క॥ తా. రా. చంద్రుఁడ నేనీ
గారాపుం బుత్రుఁడ నది గావింతును నీ
పేరన్ గృతిగన్ మను మిం
పారన్ లక్ష్మీనృసింహా నాకంబందున్.

## గురు నమస్కారము

ఆకాశగంగేవ లసత్ప్రవాహా
మాధుర్యయుక్తాచ యథేతుధారా
ధారాకవిత్వస్య విభాతి యస్య
తత్కాళిదాసాయ నమస్కరోమి.

సీ॥ ఆంధ్రభాషాంతర్య మలవరించినయొజ్జ
జనమంచి శేషాద్రి శర్మఁ గొలిచి
ఆంధ్రసంస్కృతభాష లాకావ్య వేదాంత
మతిదీక్షఁ గఱపిన యట్టిగురుల
నాకుండివంశజ వ్యాసమూర్త్యాఖ్యుఁగ
ల్లూరి వేంకటరామసూరిఁ గొలిచి
కవితత్వ మాబాల్యమవితథంబుగ నాకు
నాదర్శమొనగూర్చి నట్టి జనకుఁ
జెలఁగి తాడూరి లక్ష్మీనృసింహుఁ గొలిచి
తండ్రియానతి నెరవేర్పఁ దలఁచి నేను
దెనుఁగు సేయుదు మేఘసందేశ మందు
నతఁడు సేయక విడిచిన యట్టిదైన
చరమ సర్గంబు లలితవాక్సరణి మెఱయ.

# మేఘసందేశము

## పూర్వభాగము

చం॥ తనపదవిం బ్రమాదపడి దారవియోగ మొకేఁడు పొందుమా
యను పతిఘోరశాపమున నచ్చపుశక్తియడంగి యక్షుఁడుం
డెనొకఁడు సీతస్నానముల నిష్కలుషం బగునేళ్లు దట్టమై
పొనరు నమేరువృక్షములుఁ బొల్చెడు రామనగాశ్రమంబులన్.

(1)

చం॥ కలికిని బాసి యవ్వలపుఁగాఁ డటఁ జేతులపైడికంకణం
బులురలఁ గొన్నియానెలలు పొల్పఱియుండి నభంబు క్రిందిదా
నెలతొలినాఁడు గన్గొనియె నెమ్మిఁదటంబున వ్రాలవప్రభూ
తలమునఁ గ్రీడలోఁ బరిణతంబగు నేనుఁగుఁబోలు మేఘునిన్.

(2)

చం॥ ఎలమి జనింపజేయు నలయింపగు మేఘుని మ్రోల నెట్టులో
నిలిచి తలంచెఁబెద్దవడి నిల్పుచు లోనన బాష్పముల్ ప్రియా
కలితున కైన మేఘుఁగనఁగా మదిఁబుట్టు వికార మన్న న
ర్మిలి మెడఁగౌఁగిలించుసతి మిక్కిలి దవ్వగఁ జెప్పనేటికిన్.

(3)

చం॥ నభము సమీపమౌటయు మనఃప్రియప్రాణము నిల్ప మేఘుచే
శుభనిజసౌఖ్యవార్త మదిఁ జొప్పడఁ బంపఁగ నిచ్చఁజేసి వాఁ

డభినవశైలమల్లికల నర్చన చేసి ప్రహర్షనుంది దు
ర్లభ ఘన యంచుఁ బిల్చి కుశలంబడిగెం బ్రియమైన
పల్కులన్. (4)

చం॥ అనిలముఁ దేజముం బొగయు నప్పులుఁగూడఁగనైన మబ్బదే
డనిశబలాంచితేంద్రియులు ప్రాణులు మోచెడు రాయబారమే
డన కతఁడుత్సుకత్వమున నభ్రము వేఁడె జడంబునైననున్
గనిన స్వభావదీనులిలఁ గారట తద్దయుఁ గామపీడితుల్. (5)

మ॥ విదితావర్తకపుష్కలాన్వయమునం బెంపారఁగాఁ బుట్టితం
చు దివౌకఃప్రభుముఖ్యపూరుషుఁడ వంచుం గామరూపుండ వం
చెదఁ గంటిన్ విధి దూరబంధుఁడను నీ కే నర్థినైతిం ఘనుం
డెది యీఁడైనను వేఁడఁబోలు నధముండేమిచ్చినం బోలునే.
(6)

మ॥ ధరసంతప్తులరక్షకుండవు పయోదా భార్యనే నాథనే
శ్వరుకోపంబునఁ బాసితిం జెలికి నావార్తందయం జెప్ప మేల్
బెరయన్ బాహ్యవనస్థభూతపతి మౌళిజ్యోత్స్నకా ధౌతమం
దిర మా యక్షపురీవరం బలకకు న్నివ్వేడెదం బోఁగదే. (7)

చం॥ అనువుగ మింట నీవు చనునప్పుడు పాంథసతుల్ మహాశతో
డ నుపశమిల్లికాంతురు వెడంగొన ముంగురు లెత్తిపట్టి తా
మనఘుఁడ వీవురాఁగ విరహాతురభార్య నెవండుపేక్షనే
యును ననుబోలె మే నకట యొడ్డుల కమ్మినవాఁడు తక్కఁగన్.
(8)

మ॥ అనుకూలంబయి వీచుచున్న దిదెనీ కల్లల్లనంగాలి పి
ల్చన నీచాతకి పాడుచున్న దెడపార్శ్వంబందు శ్రావ్యంబుగా

ననఘా చూపరి మింట బంతియిడి గర్భాధానపుంబండువం
దుననా చెల్మినిఁజేసి కొల్చెదరు నిన్నుంజూ బలాకాంగనల్.

(9)

చం॥ దినములు లెక్కపెట్టుచుఁ బతిప్రతయై మనుచున్న యన్నభా
ర్యను సఫలప్రయాణమున నయ్యయవశ్యము నీవుఁజూడనౌ
నెనరయి పువ్వుమెత్తనయి నెయ్యెఁడుపాయఁగరాలునట్టి దై
పొనరెడు స్త్రీలగుండె నిలుపుంగదె యాసనుబంధ మెంతయున్.

(10)

చం॥ పొడమఁగఁజేసి కందళుల భూమి ఫలింపఁగఁజేయఁజాలు నీ
బుడిబుడి శ్రావ్యమైనయుఱుముల్ విని మానసస క్తహంసముల్
కడునునుదమ్మితూండ్ల శకలంబులు దించును మింటిమీఁదుగాఁ
దడయక వెండికొండపయిదాఁక సహాయములౌను నీకహో.

(11)

చం॥ అరయఁగబూజ్యరామచరణాంకితమధ్యముఁ దుంగముం

బ్రియం

కర మగుచుట్ట మీనగముఁ గౌఁగిటఁజేర్చి వీడుకోఁగదే
సరినిను వానకాలములఁ జల్లగఁ గూడి సుఖించి దీర్ఘమౌ
విరహముచేత బాష్పమును వేఁడిగవిడ్చుచుఁ బ్రేమసూపెడున్.

(12)

చం॥ పదపడి నాదుశ్రావ్యమగు వార్తనువిందువుగాక ముందుగాఁ
గుదురుగ నీప్రయాణమునకుం దగుమార్గము విన్మ డస్సితేఁ
బదములు మోపిశైలములపైఁ గడుఁ జిక్కితివేని చుల్కనౌ
నుదకము లేళ్లఁద్రావి సుఖమొప్పఁగఁ బోఁగలదానిఁ

జెప్పెదన్. (13)

మ॥ అగశృంగంబు హరించెనో పవనుఁడం చాముగ్ధసిద్ధాంగనల్
బెగడుంబొంది శిరంబులెత్తిఁ కనఁగా విస్తారసంరంభ మె
చ్చగు చొప్పంగ రసప్రపూర్ణనిచుళం బైనట్టి యిందుండి వే
నెగుమా మింటి కుదఙ్ముఖుండవగుచుం దిఙ్నాగహస్తావలే
పగణంబుల్ నడిత్రోవఁ జక్కడవు మాబ్రహ్మాండవేగుండవై.
(14)

మ॥ నవరత్నద్యుతిరాశినాఁగ నయనానందంబునుం గొల్పు బల్
సవరౌనింద్రధనుస్సు వచ్చె నిదె మ్రోలం బుట్టలోనుండి నేఁ
డవురా దీనను నీదు నల్లమెయి యత్యంతంబు శోభిల్లెడున్
ఛవి భాస్వచ్ఛిఖిపింఛయోగమునఁ గృష్ణస్వామి నెమ్మేననన్.
(15)

సీ॥ ఇలఁ దమపాడిపంటల కీవెయాధార
మైనవాఁడవటంచు నధికమైన
ప్రేమచేతను నిన్ను వెడనోళ్లు తెఱచుచు
నత్యంతమౌర యాప్యాయముగను
బల్లెల భామినుల్ పలుతెఱంగులఁ జూడఁ
బ్రియమంది మాలమన్ పేరఁ బరఁగు
నట్టి క్షేత్రంబెక్కి నట్టివాఁడవయౌచు
నప్పుడే యాక్షేత్ర మహహాదుక్కి.

గీ॥ వడసి పరిమళించెడు నట్టి వడువుగాఁగఁ
బ్రీతి వర్షించి పదపడి వెనుకకొదిగి
చులకనైనట్టి నడతోడఁ దొలఁగిమఱల
నుత్తరపుదిక్కు పోవయ్య యుదకదాయి. (16)

శా॥ ధారావృష్టిని దావమార్పితని నిన్ దా నామ్రకూటాద్రి సిం
గారంబారఁగ నెత్తిఁబెట్టికొను మార్గక్లేశమేదంగ నిల్
నేరన్ రా నుపకారియైన చెలి యేలేనట్టివాఁడైన స
త్కారంబుం దగఁజేయు నున్నతుని నింకంజెప్పఁగా నేటికిన్.

(17)

మ॥ మిగులంబండిన పండ్లతో నడవిమామిళ్ళ్రిక్కలం బర్వన
న్నగశృంగంబున నున్నైన జడవర్ణంబొప్ప నీ వెక్కఁగా
నగముంగాంతురు దేవదంపతులు మధ్యంబందు నైల్యంబుఁ బెం
పుగఁదక్కల్లఁ బసిండిచాయగల శ్రీభూదేవి చన్నోయనన్.

(18)

ఉ॥ చెంచెత లందుఁ గ్రీడలను జేసినపూపొదరిండ్లు చూచి వ
ర్షించి నగంబునవ్వలను శీఘ్రగతిన్ మఱిపొమ్ము పోవఁ గా
న్పించునుజూ శిలావిషమ వింధ్యపదంబునఁబడ్డ రేవ తా
మించుగఁ బట్టె లేనుఁగులమేనను దీర్చిన యందమోయనన్.

(19)

చం॥ అతులితవాంతవృష్టివయి యందలితిక్తవ నేభదాన వా
సితమును నేరెడుంబొదల ఛిన్నరయంబును నైననీరమున్
హితవుగఁ గ్రోలిపొమ్మనిలుఁడింతయు నిన్నబలుం గదల్పలేఁ
డతిలఘు వౌచురిక్తుఁడరయంగురువౌఁ గద పూర్ణుఁడెందునున్.

(20)

మ॥ నగముల్ పుట్టిన కేసరంబులకు భాస్వచ్ఛ్యామ పాలాశమై
తగునీపంబులఁగంచుఁ గచ్ఛములఁ దొల్తంబుట్టు లేమొగ్గలం
దగునన్నేల యనంట్లఁదించు వని హృద్యంబైన భూగంధమున్
మిగులంబీల్చుచుఁ జూపుఁ జిక్కచనినా నీ తెన్ను సారంగముల్.

(21)

మానిని॥ చాతురివర్షపుఁ జిన్కులమ్రింగెడు చాతకపక్షులగాంచు
చునుం
బ్రీతిగ బారులు గట్టినబెగ్గురు పిట్టలలెక్కిడి చూపుచుఁ జే
నాతఱినీవుఱుమన్ దమకంబున నాండ్రునసంభ్రమలైకడునం
ప్రీతిగఁ గౌఁగిటఁ బట్టసుఖించుచు మెత్తురుసూనిను
సిద్ధులహేలా. (22)

శా॥ నాకంబ్రీతిగ వేగఁబోవలతు వైనన్ మల్లికావాసి తం
బాకొండన్ మఱికొండఁ గాలమునునన్నావుచ్చఁ గా
హేతువౌన్
గేకారావము క్షేమమడ్గుటగఁ గన్నీరూనఁగావచ్చునా
కేకివ్రాతము వీడ్కొనంగదె యతిక్లేశంబుతోఁ జెచ్చెరన్.
(23)

మ॥ ఒనరన్నీవు దశార్ణముల్ సారఁగ నం దుద్యానవుంగంచె లో
ఘన పాండుచ్ఛవిఁబొల్చెడున్ వికసితాగ్రంబైన గేదంగులం
దనరంగాకులు రచ్చచెట్లపయి గూండ్లంగట్టు నేరేళ్ళుపం
డునునీలంబుగఁ గాళ్ళుచెప్పలను బెట్టున్ హంసముల్ వేగమే.
(24)

చం॥ అనువుగ దిక్ప్రసిద్ధవిదిశాఖ్యకునందలి రాజధాని కిం
పునఁజని కాముకత్వఫల పూర్తిఁగాంచెదవప్డె యొడ్డునం
దు నుఱిమియింపుగా భ్రుకుటితోఁడివిలాసిని తియ్యమోవిరీ
తిని నలలాడువేత్రవతితియ్యని నీరముగ్రోలఁ గల్గుటన్. (25)

మ॥ చననం దెక్కము విశ్రమార్థమయి నీచైరాఖ్యశైలంబు నీ
వును దన్నంటిన మొగ్గురొప్పుచుఁ దాఁ బుష్పించు నీపంబులన్

విను వేశ్యారతిసారభం బొసఁగుచుం బెంపొందు పెక్కుల్
గుహల్
ఘనపౌరోత్కట యౌవనంబుఁ దెలుపంగాఁ గల్గి యందొప్పుఁజూ. (26)

సీ॥ అలపర్వతముమీఁద నంబుదా యెక్కింత
సేపు దాఁకను నిల్చి సేద దేఱి
యారణ్యభూనదీతీరంబు లొద్యాన
ములునైన మాగధీముకుళములను
దొలకరించినుకుల నలరారఁ దడుపుచుఁ
దమవైన చెక్కుటద్దములఁగారు
చెమటలు తుడిచికోఁ జెవులకల్వలు నల్గి
వడివాడిపోవఁగా వఱలుచుండు

గీ॥ పుష్పలావిక లైనట్టి పువ్వుబోండ్ల
ముద్దు నెమ్మోములకుఁ జాయ తద్దయిచ్చి
నిమిషమాత్రము స్నేహమ్ము నెఱపి వేడ్క
పొసఁగఁ బిమ్మట నీ త్రోవఁబోఁగదయ్య. (27)

ఉ॥ నీరద యుత్తరంబుచనునీ కదిచుట్టగు త్రోవయైన నిం
పారుచునుండు నుజ్జయిని యందలి మేడలు చూచిపొమ్ము సొం
పారు మెఱుంగు తళ్కులకు నక్కడనుల్కి చలత్కటాక్షలౌ
పౌరకృశాంగులంగనక భాసిలు జన్మము నీది జన్మమే. (28)

మ॥ అలలొందొంటిని దాఁకఁగా జొదలు సేయంజొచ్చు నవ్వుల్గు బా
రొన్మెలనూల్ గా నుడిబొడ్డుచూపి స్థలనంబుంబొంది సొంపారఁబోఁ

గల నిర్వింధనుగూడి నీ నరసతన్ గాన్పింపుమీ త్రోవలోఁ
బిలువంజొచ్చుటకాదెయింతి ప్రియుకై ప్రేమన్ హావోయల్
సూపుటల్. (29)

శా॥ వేణీభూతతనూదయాంచుఁ దటపృథ్వీజాత సుభ్రష్ట ని
స్త్రాణాచ్ఛచ్ఛదపాండు వౌచు సుభగా తాఁ బ్రోషితుండైన నీ
నాకెంబో సుభగత్వము న్విరహిణీన్యాయంబునం దెల్పెడిన్
క్షీణత్వం బదిపాయునేమి సలుపన్ జేయంగ నీకే తగున్. (30)

చం॥ అరిగి యవంతి యయ్యుదయనాచ్ఛకథావిద వృద్ధమచ్చటన్
సరగునఁ దొల్లి చెప్పిన విశాలఁ బురిం గను శ్రీవిశాల స
చ్ఛరితఫలంబు క్షీణముగ స్స్వర్గగతదివ్యుల శేషపుణ్యముల్
గరిమను గొన్న యొక్కదివిఖండమునా నది యొప్పు నారదా. (31)

చం॥ కొలకొలకూయు హంసముల కూజితముల్ కడుఁబెంచుచున్ స్ఫుట
జ్జలజసుసంగతిన్ మిగులఁ జక్కని కమ్మని తావిదాల్చి మే
నులకు సుఖంబొసంగుచు ననూనచాటుకర ప్రియుండునాఁ
జెలులరతిశ్రమ మ్మ్రుచటిశిప్రసమీరుఁడు వాపు వేకువన్. (32)

ఉ॥ తెల్లమ యందుఁ గోట్లకొలఁదిన్ విపణిస్థలి శంఖశుక్తులున్
వల్లభరత్నయుక్తమగు స్వచ్ఛపుహారములుం బ్రవాళముల్
పెల్లుధగద్ధగప్రభల వెల్గెడు పచ్చలుఁ జూచి నీరదా
యొల్లరు నీరుమాత్రము నదీశునకుం ధర నిల్చెసంద్రుసూ. (33)

మ॥ ఇటఁ బ్రద్యోతుని ముద్దుగూఁతు నలవత్సేశుండు గొంపోయెఁ దా
నిట నారాజు పసిండితాటివనమొం తేనొప్పె స్తంభంబువే

యిటఁ బైకీడిచి గంతిడెన్నలగిరీశేంద్రమ్ముగను మ్ముంచు న
చ్చటి పెద్దల్ తగఁజెప్పి తన్నుదురు కాంచస్వచ్ఛచుట్టంబులన్
(34)

శా॥ అందుంగుట్టము లాకుపచ్చనివి సూర్యాశ్వంబులన్నించు నే
న్నం దద్రుమ్యన్నతమై సవర్ణమగునీయట్లే ప్రభేదంబుచే
నం దాజిందశకంఠునిందోదరి యోధాగ్రేసరుల్ భూషణం
బందంబు న్నగుకాయలం గనిరిసుమ్మా చంద్రహాసంబునన్.
(35)

స్రగ్ధర ॥ జాలోద్గీర్ణంబు స్త్రీకేశములదయిన సంస్కారధూపంబు నీమై
శ్రీలంబెంపంగబంధుప్రియమున నెమిళుల్ నృత్యముల్ కాను కీయన్
హోళింగాం చాపురస్త్రీ నబలలపద రాగాంకముల్ పూలతావుల్
డా లిం పీ నందమా మేడలపయిఁగని వీడంగదే తెన్ను వంతల్
(36)

చం॥ తమదొర యట్టుచాయఁగల ధన్యుఁడవీవని ప్రేమతోఁగనం
బ్రమథులు పొమ్మ లోకగురువర్యుని చండికభర్తృపుణ్యగే
హము తొవపుష్పాడిం జలవిహారరత ప్రమదాళిమున్కలన్
గమగమలాడు గంధవతి గాడువు లాగుడితోఁటమాపెడున్.
(37)

శా॥ కందా యొకడొక వేళ నీవలమహాకాళంబునుం జేరి తే
నందుంగలటి కగోచరుండురవియా సందాఁకనీవుండు నీ
వందున్ సల్పుడు సాంధ్యపూజతటి శ్లాఘ్యంబైన ఢక్కాధ్వనుల్
పొందున్ స్వల్పగ భీరమైనయుఱుముల్ పూర్ణంబుసాఫల్యమున్.
(38)

మ॥ మొలనూళ్ళొఱ్ఱియఁగనడ్గుద్రొక్కు చచటన్ మోదంబుతో-
రత్నవం
జ్ర్కలచెక్కుల్ గలపిళ్ళులీలఁగొనిచేతుల్ నొవ్వవింజామరల్
వెలయాంద్రార్చుచు గోళ్లనొక్కులను హాళిన్నిదు తొల్చిలన్నున్
జలదా తాలిచి తేఁటిబార్నిడుకటాక్షం బుంత్రుసీమీఁదనే. (39)

ఉ॥ అంతట శంభునృత్యముఖమందు జపారుణ సాంధ్యకాంతివై
యెంతయునొప్పి పెద్దభుజవృక్షవసంబును జుట్టుముట్టి త
త్కాంతభయంబుదీఱి స్తిమితంబగుకన్నులఁ జూచుచుండఁగా
నెంతయు భక్తితోడ హరియింపు తదార్ద్రగజాజినేచ్ఛనున్. (40)

చం॥ రమణులయిండ్ల కాపురిని రాములు శే చనువేళ రాజమా
ర్గములను సూదిగ్రుచ్చఁదగి రాజిలుచీఁకటి దృష్టిఁగ్రమ్మఁగా
నమరఁ బసిండిగీటు వెలుఁగందు మెఱుంగున దారిచూపుమా
క్రమమఱి వర్షగర్జలిడి గత్తరనేయకు స్త్రీలు భీరువుల్. (41)

శా॥ అమ్మైఁబెద్ద స్ఫురింపఖిన్నయగు నీయామించు పెండ్లాముతో
నెమ్మింబుచ్చినిశిం గపోతగణముల్ నిద్రించు నొక్కింటిపైఁ
బొమ్మా తక్కినపైనమీవు రవితాఁబొడ్వంగ మాంద్యంబు ధ
ర్మ్యమ్మే యిష్టజనప్రయోజనము చేయంబూని నవ్వారికిన్. (42)

ఉ॥ నీరద ఖండితానయననీరము నప్పుడు వాపఁగార్యమా
నారయ నెందునుంబ్రియుల కర్కునిత్రోవకు నోసరిల్లు వే
యారసి పద్మినీసరసిజాస్యహిమాశ్రువు లార్పవచ్చు న
వ్వీరుకరంబులడ్డఁ గడుద్వేషము దాల్చునతండు తీవ్రుఁడై. (43)

మ॥ నిరతింజొచ్చు స్వభావసుందరమయూ నీనీడరూపేని కం
ధర గంభీర ప్రసన్ననీరమున హృత్పద్మంబు సందట్లుగా
సరయుం ధూర్తత వ్యర్థపుచ్ఛఁదగ దన్నా కైరవాచ్ఛమ్ము న
త్వర పూచేఁపల మిట్టిపాటులను తద్వ్యక్తంబు లౌచూడ్కులన్. (44)

మ॥ తనరం బ్రబ్బలికొమ్మయుండుటయుఁ జేతం గొంచెముంబట్టికొ
స్ననువై గట్టుపిఱుందజారు నలనౌ నప్పీరముం ద్రోచుచుం
జన వ్రేలాడెడు నీప్రయాణ మతికష్టంబౌను సాఁగంగ నెం
దును వీడంకలఁడే రసజ్ఞుఁడు పిఱుందుంజూపు నద్దానినిన్. (45)

మ॥ కడునీవానకు నుబ్బిపొంగు ధరదా గంధంబుతోఁ గూడుటం
గడునింపౌచు గజాళి బుఱ్ఱుమని చక్కన్మక్కులం బీల్చఁగా
నడవిన్మ్రెడులఁ బండఁజేయుచును సొంపౌ చల్లగాడ్పల్ల వె
న్కడుగై వీచును దేవపూర్వగిరిపర్యంతంబు నీవేగుచోన్. (46)

మ॥ అల కొండన్ స్థిరవాసిస్కందుఁగని పుష్పాబ్దంబవై స్వర్ణదీ
సలిలార్ద్రింబగు పూలధారలను వే స్నానంబుచేయింపుమా
అల దేవుండు నవేందుమౌళి హుతవాహాస్యంబునన్ శక్రుసే
నలఁ గావన్ సృజియింప వెల్గెడు నతీనం బైన తేజంబుసూ. (47)

ఉ॥ పిమ్మటఁ గొండ్ర మోయఁగను బెద్దయునుర్మి నటింపఁజేయు వే
గమ్మజు జ్యోత్స్న తెల్లనగు కన్గొన లొప్పు కుమారునెమ్మి నృ
త్యమ్మునఁ గాంతిపంక్తి వలయమ్మగు పింఛము రాలఁ బుత్ర రా
గమ్మున గౌరిదాల్చును దగం దొపకర్ణము లైనవీనులన్. (48)

మ॥ తగనాపిమ్మట వీణమీటుచును గాంతల్ఁ దాముసిద్ధాళు లి
మ్మగ నీచిన్కులకోడి యోసరిలఁ బెంపుంజెంది కొండాఁకఁబో

యి గవాలంభముచేజనించి ధరపై నేఱైనయారంతిదే
వు గరిష్ఠంబగుకీర్తిఁ గొల్వఁగను మబ్బా వంగి వ్రాలంగదే. (49)

మ॥ అల శ్రీకృష్ణుని వన్నెదొంగవు రసంబానం బయిన్ వ్రాలుడుం
బలమయ్యుందవుకల్మి సన్నమగు నావారిప్రవాహంబు క
న్నులు దామించుకవాల్చి ఖేచరులు కందుర్నడ్మఁ బెన్నీలముం
గలభూనాయిక యొంటిపేటఁ గలముక్తాహారమన్నట్లుగన్. (50)

శా॥ దానిన్వీడ్కొని పొమ్ము నేర్పునఁ బయోదా బొమ్మలం-
ద్రిప్పుచున్
సానందంబుగ తెప్పలెత్తుటయు నౌరా నీలశుభ్రప్రభల్
గానందంబుగఁ జిమ్మునుల్లెలకు మూఁగంజొచ్చు తేంట్లోయనం
గా నొప్పారెడుచూడ్కులం దశపురీకాంతల్ గనన్ వేడ్కనిన్.
(51)

శా॥ అంతంజొచ్చుచు నీడమాత్రమున బ్రహ్మావర్తదేశంబునుం
జెంతన్ రాజులయాజిఁ దెల్పెడు కురుక్షేత్రంబు సేవింపుమా
యెంతే శాతశగాళి నర్జునుఁడు పృథ్వీశాస్యముల్ తమ్ముల
త్యంతాసారముచేత నీవు ఘన యెట్లట్లందుఁ గొట్టెంజుమీ.
(52)

మ॥ హలితాఁజుట్టవుఁ బ్రేమఁ బోరుడిగి రుచ్యంబిష్టమాకల్లు నె
చ్చెలికన్నుంచి పువ్వాది యీఁగొనక తా సేవించె నెద్దాని ము
న్నలసారస్వతతీర్థమేగి సుభగా యంతన్నునం దీవునున్
నలిశుద్ధుండవయౌదు కృష్ణుఁడవు వర్ణబందుమాత్రంబెసూ. (53)

చం॥ కనఖలచెంతఁ గాంచఁగదె గట్టుల రాయనిమీఁదనుండి వ
చ్చిన దగుజాహ్నవిన్ సగరు చిన్నల స్వర్గపునిచ్చెనం దగన్

విను మది గౌరి బొమ్మముడి ఫేనములన్ నగెనాఁగనొప్పు చిం
దునలము నూర్మిహస్తములతో నలశంభుని కొప్పువట్టెఁజూ.

(54)

మ॥ వెనుమై మింటను వ్రేల నడ్డుపడుచున్ వేల్పేనుఁ గట్లీవు గం
గను శుభ్రస్ఫటికాచ్ఛనీరమును ద్రాగంజూచితే నీరదా
చన నీనీ డటసంక్రమించుటయు నస్థానంబునం దోడుతోఁ
జను నా గంగ మనోజ్ఞయౌచు యమునాసంగంబ మైనట్లుగన్.

(55)

మ॥ తగ నాసినమృగాళినాభి సురభిత్వం బందుటాల్గల్గి తా
నిగమార్గం దెలుపౌచు దానిజనియిల్లేయా గిరింజేరి చ
క్కఁగ మార్గశ్రమదీఱ దాని దగుశృంగంబందుఁ గూర్చుంటివే
నొగిఁ దాల్తా శివశుభ్రశృంగవవిసాణోత్ఖాతపంకప్రభన్.

(56)

మ॥ ఘనవాతంబులు వీచుచుండ సరళస్కంధాతిసంఘట్టనన్
వనవహ్నుల్ జనియించి యుల్కఁ జమరీవాలంబులంగాల్చి కొం
డను నొంపన్ బహువారిధారలను నన్నా యార్పనీకుందగున్
వనదా యుత్తముకల్మి కెందు ఫల మాపన్నార్తి పోఁగొట్టుటే.

(57)

మ॥ ఘన యీవేస్గని యల్గి వేగమెగురంగాఁగాంచి నీ వోసరి
ల్లను నీమీఁదికి దాఁట నాశరభముల్ భంగంబుస్వాంగంబు గాఁ
గను వానిన్ వడగండ్లవానలను వీఁకన్ మొత్తి త్రోవంగదే
అనఘా మోడరె వ్యర్థఘుంబనులకున్ యత్నించు నెవ్వారలున్.

(58)

మ॥ జలదా యందొకజాతవ్యక్త మల శశ్వత్సిద్ధసంపూజితం
బలరన్ వంగిప్రదక్షిణింపు శివపాదాంకంబు సద్భక్తితో

నల దానింగనునట్టి యాస్తికులు దేహాంతంబునం దవ్యక్తపా
పులమై తత్ప్రమథాళి నిత్యపదముం బొందంగలా రెవ్వరే. (59)

మ॥ అనిలాపూరితమౌచు వేణుతతి శ్రావ్యంబైన నాదంబునీ
ననుమక్తంబుగఁ గిన్నరుల్ త్రిపురసంహారంబు కీర్తింతు రీ
వును సంరావముచేసితే గుహల సొంపుంగా మృదంగధ్వనిన్
ఘనసంగీతపదార్థపూర్తి యపుడౌఁగా దేయటన్ శూలికిన్.(60)

మ॥ లలిశైలోపతటీవిశేషముల నెల్లంగాంచుచుం బోయి యం
చలతెన్భార్గవుకీర్తి తెన్నునగు క్రౌంచజ్యాగ్ర రంధ్రంబునం
బలిబంధక్రమకృత్త్రివిక్రముని శ్యామంబైనపాదాబ్జముం
బలె నడ్డంబగు నిడ్పుచేఁబొలిచి పొమ్మాయుత్తరాశాగతిన్.
(61)

మ॥ పిదపన్ మీఁదుగఁబోయి రావణభుజావిశ్లేషితప్రస్థమై
త్రిదశస్త్రీలకు నద్దమైన రజతాద్రిన్నిల్వుమావిందవై
అది మిన్ బర్వుచుఁ గల్వతెల్లనయి యెత్తౌ శృంగజాలంబుతో
డఁ దగున్ దాఁ జిరరాశియైన శివుదట్టంపట్టహాసంబనన్. (62)

మ॥ కలయన్నూరిన సన్నకాటుకదియౌ కాంతిం దటిన్ వ్రాలి నీ
వలరంగోసిన యేన్గుదంతమటులన్నా తెల్లనౌ కొండకున్
నలిఁ గన్నారఁగఁజూడఁగాఁ దగినయందంబబ్బు నంసంబుపై
నల నీలాంబరముంచినప్డు హాలి కెట్లట్లే మదింజూడఁగన్. (63)

చం॥ వరుఁడు భుజంగకంకణముఁ బాచియిడంజెయిపట్టి కాల్నడన్
గిరిసుత యావిహారగిరి నెమ్మి విహారమునల్పెనేని స

త్వరముగ మున్నువోయి తగ స్తంభనచేసి జలంబు మేనునం
తరువులుచేసి మెట్టులవిధం బగుమా మణిసాను వెక్కఁగన్.

(64)

మ॥ మలపై యంత్రవుధార యిల్లనఁగఁ జిమ్మన్ బుస్సునన్నీళ్లు వే
ల్పులతాతన్వులు కంకణంపుఁ గులిశంబుల్ వెట్టి నిగ్గొట్టువా
రెలమిన్వేసవియాట వారు విడరై రేనిన్ భయంపెట్టు వీ
నులుప్రయ్యం బెళపెళ్ళటంచుటిమి యెంతో క్రీడవారేమఱన్.

(65)

శా॥ పొందమ్ముల్ జనియించు మానసరసంబుల్ గ్రోలు చన్నా తుణం
బందున్ స్వాకకరికిచ్చుచాస్యపటహార్షాధిక్యముం గల్పకం
బందోప్పారు చిగుళ్ళచీరలను నీడాగాలిచే లాగుచుం
జందాల్పెక్కగు క్రీడలం గిరి వయస్యా స్వేచ్ఛభోగింపుమా.

(66)

మ॥ దయితోత్సంగమునం బలెన్ శిఖరి మిత్రా ప్రస్తమా గంగ వ
ల్వాయమై కన్పడునట్టి మాయలకయోపై స్వైరాధ్వత్వద్జ్ఞాత యే
పయి నయ్యుచ్చవిమాన తాల్చు జలముక్పంక్తిం
జలోద్గారముల్
బ్రియముక్తాగ్రథితంపు ముంగురులనున్ మీనాఁడు స్త్రీవోలె నే.

(67)

గద్య

ఇది శ్రీమదాపస్తంబసూత్ర వాధూలసగోత్ర తాడూరి
రామరాయ పండితాగ్రపుత్ర లక్ష్మీనరసింహ
రాయ ప్రణీతంబైన మేఘసందేశ
పూర్వభాగము

---

## ఉత్తరభాగము

సీ॥ మేలిబంగరు చాయ మేనుదీఁగెలఁ బొల్చు
లలనలు నీమించు లతల కుద్ది
పలువన్నె చిత్రంబు లలరారు పటముల
బంతి నీ యింద్రచాపముల కుద్ది
సంగీతసహితమై శ్రావ్యమా మార్దంగ
రావంబు నీదు గర్జలకు నుద్ది
మణికూర్పు గల కుట్టిమంబుల నిగనిగల్
నీలోని మెఱుఁగారు నీటి కుద్ది

యగుచు నలరారు నివియెల్ల నమరుచుండ
నున్నతుఁడ వైన నినుబోలె మిన్నుముట్టి
యలకలో నున్న ప్రాసాదములు దలంప
సర్వవిధముల సరితూఁగఁ జాలునీకు. (1)

శా॥ లీలన్ దామరపూవు కేల నలకన్ లేమొల్లలున్ మోమునం
దా లోధ్రప్రసవంపుఁ బుప్పొడిని దెల్పార్లక్ష్మియున్
గ్రొమ్ముడిన్
లేలేగో:రఁటపూవు పిన్గవను పాళిన్ మేల్ శిరీషంబులున్
స్త్రీ లచ్చోట ధరింత్రు బాపిట నిఁకన్ నీపంబు నీరాకకున్. (2)

శా॥ పూలన్ నిత్యముబూయఁ జెట్లు భ్రమరంపుం
ఝంకృతిన్ బొల్చు,ఁబ
ద్మాలన్ నిత్యము గంట నంచసుడికాఁ ద్రా డూనెడిన్
బద్మినుల్,
క్రాలన్ బింఛము సొంపు నిత్య మట కేకన్ నెమ్మి లత్తెత్తిడిన్,
రేలావెన్నెల నిత్య మాహత తమోవృత్తిన్ దగన్ రమ్యమా.
(3)

మ॥ కన నానందమ గాక కారణ మనన్ గన్నీటి కొండుండ దా
ననవింటన్ బొడసూపి యిష్టజన సంధానంబునన్ దీఱు కాఁ
కను గాకొండు గనంగరాదు పొలయల్కన్ గాక పాపుండ దీ
డన నాయక్షుల కెల్ల జవ్వనమ గా కన్యంబులే దచ్చటన్ (4)

మ॥ తెలిఱాకట్టున రిక్కచాయనన కాంతిన్ బెద్దసొంపారు మే
డలపై నన్నులమిన్నలన్ గలసి వేడ్కన్ యక్షులెంతేని వే
ల్పులతన్ దీసిన మద్యమున్ రతిఫలంబున్ గొల్తు రా పుష్కరం
బులు గంభీర రవంబులం దెనసి నిన్ మ్రోగంగ నల్లల్లనన్. (5)

మ॥ అల మందాకిని నీటిమీఁది శిశిరంబౌ వాయువుల్ వీవ వే
లల మందారపు నీడ లుష్ణమును బెల్చన్ బాపి నెమ్మోయ వే
ల్పులుగామించెడు కన్యసంఘ మటఁ జల్పున్ గ్రీడ గన్గొంగ ము
ష్టులతోఁ బోయు పసిండిమంట నిడి నా చొక్కంపు రత్నంబులన్.
(6)

మ॥ కడుఁ జాంచల్యముతోడి కేల్బఱపి రాగంబారఁగా భర్తల
క్కడ నీవుల్ విడజాఱు వల్వలెడపంగా ముగ్ధబింబాధరల్
వెడఁగున్ జెందుచు సిగ్గునన్ దఱిసియే పెన్గాంతి రత్నంబులన్
వడి దీపభ్రమ నార్పఁ జొత్తురు వృథాపైఁ జల్లుచున్ గుంకమున్.
(7)

మ॥ అలరన్ బెక్కువిధంబులౌ రతుల నత్యంతంబునున్ నొంచి భ
ర్తలటన్ గౌఁగిలి వీడ రేనడుమ నంతంజంద్రు వీడ్కొంటి వే
నెలపాదంబులు స్వచ్ఛమై యురమునన్ వ్రేలాడు చంద్రోపలం
బులపై సోకి ద్రవింపఁ జేయుచు శ్రమంబుం బాపుఁ గాంతాళికిన్.
(8)

మ॥ తమి నా నేత సదాచరుం డలప్పురిన్ దార్వన్ విమానాగ్రదే
శములన్ బొమ్మలకెల్ల జేకుటిచి దోషం బందు వార్బిందునే
కముచే భీతిలినట్ల నీసములు మేఘశ్రేష్ఠు లా జాలమా
ర్గములన్ బోదురు నేర్పుతోడ పొగపోకన్ బోలి పల్పాయులై.
(9)

చ॥ ధనపతికీర్తి కిన్నరలు దద్దయుఁ బాడఁగ రక్తిగట్టు ని
స్వనముల తోడ నా దివిజ వారిజనేత్రలు వారముఖ్యలై
చనఁగ సహాయులై తఱుగఁ జాలని పెన్నిధు లొప్పకాముకుల్
జని విహరింత్రు ప్రత్యహము చైత్రరథాఖ్య బహిర్వనంబునన్.
(10)

మ॥ తమిఁ బోఁ ద్రొటిల వేణినుండి పడు మందారంబులున్ బత్రఖం
డము లా వీనుల నుండి జాఱిపడు పొందమ్ముల్ జనుంగుబ్బ బిం
కమునన్ ద్రెస్సెడి హార పంక్తులును ముక్తాజాలముల్ దెల్పు న
ద్దమరే గామినులేగు మార్గమట మార్తాండుండు దోఁచంగనే.
(11)

మ॥ కని ఫాలాక్షుఁడు శ్రీదమిత్రుఁ డట సాక్షాద్వర్తియై యున్కి భీ
తిని బూవిల్తుఁడు దేఁటినారివిలువృత్తిన్ బూనఁ డక్కార్య మా
తనికిన్ జేకుఱుఁ జూపుఁదూపు లవితథ్యం బొప్పఁగా బొమ్మవిం
టన దా మేయఁగఁ గామిలక్ష్యమున జాణల్ బల్ వగల్
నింపుచున్. (12)

శా॥ మేనం దాల్పఁగ భూషణంబులును బల్ మేల్ రంగులౌ వల్వలున్
దా నా కంటికి విభ్రమం బొసఁగు మద్యంబున్ బదాబ్జంబునన్
బూనన్ లత్తుకరంగు బూల్ గిసలయంబుల్ గల్పకం బొక్కఁడే
నానామండనమండలం బబల కీనంజాలు నచ్చోటునన్. (13)

మ॥ కన నా దవ్వున కింద్రచాపగతి దృక్పర్వంబ యౌ తోరణం
బునఁ బొల్పారియు నాదు కాంత కృతకంబుం బుత్రునాఁ
బెంపఁ జెం
తను జేయందెడి పూలతో నొరగు మందారంబుతో నొప్పుచున్
ఘన! మత్సౌధ మొకింత యుత్తరమునన్ గౌబేర మాదానికిన్.
(14)

శా॥ ఆ మా లోగిటఁ బచ్చఱాపఱమెట్లై యొప్పి వైడూర్యనా
ళామీలచ్ఛద భర్మపద్మభరితాచ్ఛప్పూరమౌ వాపిలో
సామీ! నిండగు నున్కఁగొన్నవగు నంచల్ గాంచియున్
నిన్నిటన్
దా మాచెంతన యున్న మానసము నెన్నం బోవు నిశ్చింతమై.
(15)

శా॥ ఆ వాపీతటి నింద్రనీలమయ శృంగాన్వితమై పొల్చు, నం
దా వేష్టించెడి పొన్ననంట్లగమి నేత్రానంద మీ, నాట గ
ట్టీ వీ నైల్యము శంపకాంతి గన నిన్నేఁ గాంచ నక్కొండ యే
నా వాల్గంటి కతిప్రియంబగుట నన్నా! వ్రేలె నా మోమునన్.
(16)

చ॥ అలగిరి గోరటంపు వలియందలి పొండ్రక మంటపంబు ది
క్కలరు సురమ్య కేసరము నా చలపల్లవ రక్తవంజులం
బెలయును దోహదంపు మిష నింపులు నా చెలి నోటికల్లునన్
లలిఁ బదఘాతి న వ్వలచలం బుడుపన్ జను నన్నుఁ బోలెనే. (17)

మ॥ వలయంబుల్ పడి రింగు రింగురన మద్వామాక్షి కేలార్చు చా
టలఁ గొల్పన్ గడు నృత్తమాడి నిశిఁ దా డయ్యంగ-
మానెమ్మి మీ
చెలి యా చెట్టుల నడ్మ లేవెదురుడాల్ జెన్నందు మాణిక్యవే
దిలసత్కాంచనయష్టిపై స్ఫటికపుం దిన్నెన్ దగన్ గూర్చెడిన్.(18)

మ॥ మది నీ చిన్నెలు సక్కనిల్చికొని కన్మాత్ర నేర్పునన్ మాగృహం
బది ద్వారంబు కెలంకులన్ గలది సుమ్మా శంఖపద్మంబు ల
య్యది నాలేమిని జిన్నబోయినది యా నందంబుతో నుండెడిన్
గదె సూర్యాస్తమయంబునన్ గమల రాగం బొప్పునే
తొంటిమైన్. (19)

మ॥ ఘన ! నీ వేనుఁగు గున్నయం తగుచుఁ జక్కం జొచ్చి
యచ్చోటునన్
మును నా చెప్పిన రమ్యసానువగు చింపుంగూర్చిన య్యాటకొం
డను వే వ్రాలి మెఱుంగు బుర్వగమి దా డాలొప్ప నీమించుత
ళ్కును చూపుల్ నిగిడింపఁగాఁ గడఁగి తేనల్లల్ల నాయింటిలోన్.
(20)

సీ॥ నిండఁ బండినమేలి దొండపండువిధైన
కెంపు లీనెడు మోవిసొంపు దాని
మల్లెమొగ్గలువోలె తెల్లనై మొనదేరు
పలుబంతి నెంతేని వెలయుదాని
నడలిన లేడిదా వెడద కన్గవ చూపు
గంభీర నాభియు గలుగుదానిఁ
గలదు లేదనఁబోలు కౌనొప్పి చనుదోయి
భరమున నొక్కింత యొరగుదాని

వలుద లౌ పిఱుఁదుల బరువు చేతను మంద
మందంపు నడ యంద మందుదాని
బాలలతవోలె సన్నమై వఱలు దాని
నడిమి జవ్వన మందున్న నాతి నచటఁ
గనకగర్భుని తొలిచేత కాంత యనఁగ
వెలయు కాంతను గాంచఁగాఁ గలవునీవు. (21)

మ॥ వెలిమై దవ్వునఁ దోఁడునీడ నగు నే వేఁగంగఁ దా నొంటిమై
నల చక్రాంగినిఁ బోలి పల్కరిదియై యుండుండు నక్కాంత నా
వెలిప్రాణం బదెసుమ్ము తా విరహనిర్వేదాప్తి మంచేసిన
న్నలినిం బోలియు నేని నుండఁజను నన్యంబైన రూపంబుతోన్. (22)

చ॥ అనయము గంట నీరునుప నక్కట యుబ్బిన కన్నుపొట్టతోఁ
దనవగు వేఁడియూర్పులకుఁ దద్దయు మారిన మోవిరంగుతోఁ
గననగు నాతిమో మలఁతిఁ గ్రైనిడ ముంగురు లోలిఁ గప్ప నీ
యనుసరణంబునన్ విభవ మంతయు వీడిన చంద్రుదీనతన్. (23)

మ॥ ఎడగాఁ జిక్కినయట్టి నాతనువు నెంతే నెంచు చద్దానిఁ బో
లెడు చిత్రమ్మును జెక్కు చొండె బలులోలిన్ నాదు మేల్ రాకకై
యిడు చొండెన్ దన గూటిశారికకు “ నెంతే? మత్ప్రియున్,
గూర్తు గా
కడు నీ వాతని” కంచు నొండె నతిదాఁగన్పట్టు నచ్చోటునన్. (24)

శా॥ నా పేర్మిదుగఁ గూర్చినట్టి పదముల్ బాడంగ నంకంబు నన్
దాపన్ జేయుచు వీణ యమ్మలినవస్త్రప్రేత్యు యెల్లని న

ప్రాపాతార్ద్రము లైన తంతులను నన్నా! తుడ్చి పల్మ్రోలు తా
నే పూరించిన మూర్ఛనల్ మఱచుచేనిన్ నీకుఁ గాన్పించెడిన్.
(25)

మ॥ ఒసరన్ గుమ్మము మీఁది పూలునిచి తా నొక్కొక్క టే నేల వం
కను లెక్కించుచు నాకు శాప మితి దాఁకన్ దక్షమాసంబులన్
మనమందుం జవిగొంచు నేని రతిసంరంభంబుఁజింతించి తాఁ
గననౌ జామ్త్రి యివే గదా విరహిణీకాంతావినోదంబు లౌ.
(26)

మ॥ పను లీరీతి వొనర్చు చున్కిఁ బవ లేపంబోదు పాపంతగాఁ
గన రేలేమి వినోదమున్ గలుగమిన్ గాఁజింపఁ బెల్లేది ని
ద్రను నేలన్ బవళించు మత్ప్రియ నిశీథం బప్డు వాతాయ నం
బున నీ వుండి మదీయ వార్తల సుఖంబున్ గొల్పఁ జూడంగదే.
(27)

మ॥ చనె నేరే యటు గోరినెల్లరతు లాస్వాదింప నాతో క్షణం
బన నారే యిప్డో యుగంబుగతిఁ దానస్రంబులన్ బుచ్చుచున్
వనటన్ జిక్కి వియోగశయ్యఁ బవళింపన్ బ్రక్కగాఁ
దూర్పుమూ
లను నొండేకళ దక్కియున్న నెలలీలన్ బోలియేనుండెడిన్. (28)

మ॥ జలదా! సోరణగండ్లఁ జల్లనగునా చంద్రాంశువుల్ బర్వినన్
దొలి ప్రేమన్ గనఁజొచ్చి వే మఱలు కన్నుందోయి పై వంతనౌ
నల కన్నీటను నుబ్బు రెప్ప లరమూయన్ గాంత గాన్పించు, మ
బ్బులు గప్పన్ రవి, లేచిలేవనిది యా భూపద్మినింబోలెనే.
(29)

మ॥ అలకల్ను స్వతి గొడ్డుస్నానములతో నాగండలంబంబులై
చలియింపన్ దన మోవి లేజివురు లాసం బేర్చు నిట్టూర్పునన్

గలనే నయ్యేడు నాదు సంగమని తాఁగాన్పించుఁ గన్నీటి ధా
రలఁ బల్మాఱెడగల్గు నిద్ర గనులారం బోవ నాసించుచున్.
(30)

మ॥ చన నాదుఃఖము శాప మంతముగ హర్షంబదు చే విప్పు వాఁ
డనుగా వీడ్కొని నష్ట దీక్షుగాని తోడన్ బూవులన్ దుల్చి తా
ల్చిన దా వేణి పెనంగి నొవ్విడఁగఁ దాఁ జెక్కిళ్ళపైనుండి పే
ర్చిన గోళ్లొప్పెడు వ్రేళ్ల నల్ల సతి సారింపంగఁ గాన్పించెడిన్.
(31)

మ॥ తన యాకల్పము లన్నిఁటిన్ దిగిచి వంతంజెంది పల్మాఱు పా
న్పున డొల్లించెడి పేశలాంగకము చొప్పుం జూచు నిన్నందు నూ
తన నీరంబను బాష్పముల్ విడువఁగాఁ దత్కాంత జేయుంజుమీ
ఘనులార్ద్రాతిశయాంతరాత్ము లగుటన్ గారుణ్యసంయుక్తులే.
(32)

మ॥ వల పుష్పాంగు మనంబు గల్గు కతనన్ బద్మాక్షి నాపై, నిటుల్
మెలఁగున్ దొంటి వియోగవేళ ననుచున్ బేర్కొంటిఁ
దర్కించియే
జలదా! నే సొబగుండ నన్ మురుప్పుతో జల్పంబు లాడంజుమీ
నలిఁ గన్నారఁగఁ గాంతు వే నుడిన చందంబెల్ల వేవేగమే.
(33)

మ॥ అలకల్ గప్పనపాంగ, మంజనము స్నేహంబేది లోలాక్షి క
న్నుల కన్ బొమ్మ విలాసముల్ మఱచి మద్యాసేవ లేకున్కి మేల్
బలుకన్ జొచ్చెడి నీదు రాకను స్ఫురింప బోలు నోమీఁద మీల్
గలపన్ నీటఁ జలించు కల్వపువు శ్రీలం దాల్చు చందంబునన్.
(34)

మ॥ స్మర కేళిశ్రమ మేన దీర్పఁ దగి సంవాహంబునన్ నున్ననై
సరసంబైన యనంటి కాండమురుచిన్ జాలించువామోరు వ

య్యరవిందాసన దిష్టదైవగతి నన్నా ! నాదు గోర్కొనుల్ లున్
సరిముత్తెంబుల పొందు లేకదరు నీ సాన్నిధ్యమై నంతనే. (35)

మ॥ అలతన్ నాచెలియప్పుడందు సుఖనిద్రాసక్తిమై నుండెనే
జలదా! యామముసైచి యుండు తగగర్జల్ మాని
మెట్టులో
కలలోనన్ బ్రియుఁగాంచి బాహులతలన్ గంఠంబు
గాఢంబుగాఁ
గలయన్ జుట్టిన కౌఁగిలింతసతి కగ్గాలంబ పోకున్నకై. (36)

శా॥ అంతం దుంపురు చల్లగాడ్పులను నీవాలేమ మేల్కొల్పుచున్
సంతాపం బల జాజిమొగ్గలకు నోజన్ బాపి శంపాస్ఫురత్
కాంతుల్ లోన నడంచికొంచు, సతి నిన్ ధారాళమాదృష్టితో
వింతన్ డాయఁగ జేసి పల్కు మిటు గంభీరంపు గర్జోక్తులన్.
(37)

మ॥ కుడు నీ భర్తకుఁ గూర్చు నెయ్యుఁడను నేఁగల్యాణి! సద్వార్తలా
తఁడు వంపన్ హృదిఁ దాల్చి నీదయిన చెంతన్ జేరితిన్
దోయ వా
హుఁడఁ బాంధుల్ వెతనంది కాంతల జటల్ సోత్సాహులై
విప్పుచో
ప్పెడఁదన్ దాల్పఁగ వేగిరం బిడుదుఁ గాదే మంజు మంద్ర
ధ్వనిన్. (38)

మ॥ తెలుపన్ నీవిటు లాంజనేయు నల పృథ్వీపుత్రినాఁ జెల్వని
న్నలమిన్ బొంగెడి చిత్తమొప్పఁ గని యెంతేభక్తి మోమెత్తి నీ

లలి తాలాపము లాలకించును సుహృల్లబ్ధంబు లౌ భర్త వా
ర్తల విన్కన్ బతిసంగసౌఖ్య మనుభూతం బైన యట్లేయగున్.
(39)

మ॥ ఘన! పుణ్యాత్మక! నాదుపల్కు లట పల్కంబోయి నీమాటగా
ననుమీ కాంతకు ముందు "నీసహచరుం డా రామగిర్యాశ్రమం
బున జీవించుచు నొంటి నీదు కుశలంబుం గూర్చి యండ్గంగదే"
యని బేలం దొలి పల్కఁగాఁ దగిన దయ్యా! యిద్దియే గాద టే.
(40)

మ॥ బలిమిన్ దానల దుష్టదైవ మెడబాపన్ దూరమందుండి య
శ్రులఁ దోఁగన్ వెతఁగాఁగి సన్నగిలి యూర్పుల్ వుచ్చు నమ్మేనిన
శ్రులఁ దోఁగన్ వెతఁగాఁగి సన్నగిలి యూర్పుల్ వుచ్చు నీమేన ని
చ్చలు సంకల్ప బలంబునన్ జొనుపు నాశన్ భర్తయుంచున్
మటిన్. (41)

బంధుర

చెలు లొకపరి నెదురుగఁ గలిగిననున్ జెక్కిళ్ళు లంటఁగఁ
గోరుచు నీ
కెలుగునఁబలుకఁగఁ దగినదెయగు పల్కంతయు మెల్లఁగ
వీనునఁదాఁ
బలికిన చెలువుఁడు గన వినవెడమై బల్ వలపేర్పఁగఁ
గూరిచినేఁ
బలుకఁగ ననిపిన పద మిదెవినుమీ పల్కదనంచిటు
పల్కఁగదే. (42)

సీ॥ నీమేని లాలిత్య మేమేని గననెంచి
శ్యామాలతాలి నే నరసి చూతు

నీమోము సిరిగాంచ నేనల్ల యమృతాంశు
బింబంబు కళలెల్ల వెదకి చూతు
నీవేణి మిసమిస లేవేని గననెంచి
నెమిళుల పింఛంబు నెమకి చూతు
నీసోగకను బెళ్కు వేసంబులను గాంచ
నడలిన లేడి చూ పరసి చూతు

వలచి నీవగు కన్బొమ్మ విలసనముల
నదులలో చిన్ని వీచికల్ వెదకి చూతు
నొకట నెందైన సాదృశ్య మకట నీకుఁ
గాన నైతిని చండి! నిక్కమ్ము సుమ్ము. (43)

మ॥ పొలయల్కన్ గొనినట్లు నీదయిన రూపున్ ధాతురాగంబుతో
శిలపై వ్రాసి తదీయ పాదముల నన్ జేర్పంగ యత్నింపఁగా
నల యశ్రువ్రజమోడి నా కనులనాహా! చూపు మాపెంగ దే
చలపట్టెన్ జెడు దయ్య మొల్లమికి నీ సంగంబు నాకెచ్చటన్.
(44)

మ॥ కలలోఁ గాంచుచు నీదు రూపమును నిక్కంబంచునుం గౌఁగిలిం
తలకేఁ జేతులు జాఁప నొక్కపరి శూన్యంబందుఁ దద్వైఖరుల్
తెలియా యీవనదేవతల్ దెలిసి జాలిం బొంది కన్నీటి బొ
ట్లల ముత్తెంబుల యంత రాల్పుదురు సుమ్మాయింకనున్
జెట్లపైన్. (45)

మ॥ పిలుచన్ వీచుచు దేవదారు వనిలోఁ బీడించుచుం బల్లవం
బులఁదత్ క్షీర సువాసనల్ బఱపుచున్ మోదంబుగా దక్షిణా

కలకున్‌వీచు హిమాద్రివాయువుల నాశన్ గాఁగిటం
గొందుఁడా
మలకన్ నీ శుభగాత్రమున్ జెనకెమున్నం చెంచుచున్
నెచ్చెలీ. (46)

మ॥ చినుకన్ గుప్పెడు భూసువాసనలతోఁ జెన్నందు నీ మోము చెం
తను లేమిన్ గృశు నన్ను నేఁడె మరుఁడన్నా! నొంచె,
వర్షాప్తికిన్
ఘనసంఘాతము దట్టమై పఱచు చాకాశంబునన్ సూర్య కాం
తిని గప్పన్ గడపంగ నెట్లగునొ తన్వీనాకు వారంబులన్. (47)

మ॥ అతిదీర్ఘం బయి వేగు రేలు క్షణ మట్లాఁగాక నాకంచుఁ జం
డతరాతిప్రసరంబు మాని రవి మాంద్యం బొప్పఁగా నాకు వె
ల్గుత మంచున్ గడు రిత్త కోర్కులనె మగ్గున్ నామనం బిప్పుడిం
దతితీవ్రంబగు త్వద్వియోగశిఖ కాహా! శాంతి లేకుండెఁగా.
(48)

శా॥ ఆమై నుండియు మేల్ దలంచికొను చే నానక్తిమై ధీరతన్
నామై నిల్పితి నేమియున్ దిగులు పొందం బోకుమీ నిల్కడై
యేమే నుండునె దుఃఖమేని సుఖమే నెవ్వారికిన్ జక్రపున్
నేమిన్‌బోలెనె క్రిందు మీఁదు నగుఁ దన్వీయాదశాకీతులున్.
(49)

మ॥ కల దీ శాపము నాల్గుమాసములె యింకన్ నాకు శేషాహిపైఁ
గల చక్రాయుధుమేలుకోల్ దనుక నే కన్మూసి వేగింపు మా
వలి యా శారదచంద్రికానిశల నిర్బాధంబుగాఁదీర్పనుం
గల మే మేమిటఁ గోరికల్ విరహావేగంబందు నాయెల్లనున్.
(50)

మ॥ మును పౌర్కు_ప్పుడు కౌఁగిలించియె ననున్ బాల్పారని్రదించి పా
న్పున వాపోవుచు లేచి తీ వపుడు నిన్నుం బల్కరింపంగ నే
'ననయా! నా కలఁగానిపించితివ యన్యం గూడి యున్నట్టు లీ'
వని లోలోనన నవ్వికొంచునొగి భామా! పల్కితీ వంతటన్.

(51)

మ॥ మన యీవృత్తము గుర్తుగాఁగుశలినై మంచుంటి నంచెంచుమీ
జనతావాదము నమ్మినాయెడలి విశ్వాసంబు పో నీకు క్రమం
దును నెయ్యంబు వియోగమం దనుట యెందుంగల్లయే
భోగ్యచిం
తనచే దానిరసంబు పొంగి పొరలన్ ద్రా,క్షేమపూరంబయా.

(52)

మ॥ చెలి నీరీతి వియోగదుఃఖ మెడపన్ జేయంగ నోదార్చి నీ
వల ముక్కంటివృషంబు గోరుకొన లోపాప్పొక్కండ వే వీడుచున్
జెలినాకంపెడి క్షేమవార్త లిచటన్ విన్పించి ప్రత్యూష మం
దలి మల్లెంబలె స్రుక్కియున్న దగు మత్ప్రాణంబు గాపాడుమీ.

(53)

మ॥ చలుపఁ బూనితె బంధుకృత్య మిది యోసౌమ్యుండ!
కాకేమి మా
ర్పలు కీ విచ్చుట గాదు సాత్యమల ధీరత్వంబు నీ కున్కికిన్
బలుకే మాడకె నీర మిచ్చెదు గదా ప్రార్థింపఁగాఁ జాతకం
బుల కి ట్లర్థుల కీప్సితం బొసఁగుటే పుణ్యాత్ము మార్పల్కనన్.

(54)

మ॥ నిను నే వేఁడిన పంపు నీకుఁ దగ దేనిఁ మత్ప్రియంబౌటనో
ఘన! స్నేహంబుననేనినే విరహి నన్ కారుణ్యభావంబు పెం

పుననేఁజేసి త్వదిష్టదేశములు నీవుం బొమ్ము వర్షాత్తమై
చను శ్రీదాల్చుచు నన్నుఁబోల కెపుడున్ శంపాసమేతుండవై.
(55)

మ॥ అల యక్షాంగన ప్రాణరక్ష కయి రమ్యారావుఁడై నట్టి యా
జలదశ్రేష్ఠుఁడు దివ్యవాక్సరణి నా సందేశముం దెల్ప వీ
నుల విందారఁగ యక్షియుం మనియెఁ గాంతుంగూర్చి
మోదంబునన్
జెలియా నుత్తము వేడికో లెవరి కేనిం నిష్ఫలం బౌనటే. (56)

మ॥ విని యా వార్త ఘనుండు జెప్పినది దావిత్తేశుఁడున్ దోడ నో
పనికోపం బడఁగార జాలిగొని శాపం బంతముం జేసి కూ
ర్చెన. యాదంపతు లిర్వురన్ విగళి తార్తిం హృష్టచేతస్కులౌ
చును నిష్టార్థ సుఖోపభోగములలోఁ జొక్కంగ నుం జేయుచున్.
(57)

ఇది శ్రీమదాపస్తంబసూత్ర వాధూలసగోత్ర
తాడూరి రామచంద్రరాయప్రణీత
మేఘసందేశ ద్వితీయసర్గము

---

